# అథచతుస్త్రింశోऽధ్యాయః

# చతుర్దశ మన్వంతర వర్ణనము

శౌనక ఉవాచ !

మన్వంతరాణి సర్వాణి విస్తరేణానుకీర్తయ ! యావంతో మనవశ్చైవ శ్రోతుమిచ్ఛామి తానహమ్ || 1

శౌనకుడు ఇట్లు పలికెను -

మన్వంతరములను అన్నింటినీ విస్తరముగా వర్ణించుము. మనువులు ఎందరు గలరో, వారి గురించి నేను వినగోరుచున్నాను. (1).

సూత ఉవాచ |

స్వాయంభువో మనుశ్చైవ తతస్స్వారోచిషస్తథా | ఉత్తమస్తామసశ్చైవ రైవతశ్చాక్షుషస్తథా || 2

ఏతే చ మనవః షట్ తే సంప్రోక్తా మునిపుంగవ | వైవస్వతో మునిశ్రేష్ఠ సాంప్రతం మనురుచ్యతే || 3

సావర్ణిశ్చ మనుశ్చైవ తతో రౌచ్యస్తథా పరః | తథైవ బ్రహ్మసావర్ణిశ్చత్వారో మనవస్తథా || 4

తథైవ ధర్మసావర్ణీ రుద్రసావర్ణిరేవ చ | దేవసావర్ణిరాఖ్యాత ఇంద్రసావర్ణిరేవ చ || 5

అతీతా వర్తమానాశ్చ తథైవానాగతాశ్చ యే | కీర్తితా మనవశ్చాపి మయైవైతే యథా శ్రుతాః || 6

మునే చతుర్దశైతాని త్రికాలానుగతాని తే | ప్రోక్తాని నిర్మితః కల్పే యుగసాహస్రపర్యయః || 7

ఋషీంస్తేషాం ప్రవక్ష్యామి పుత్రాన్ దేవగణాంస్తథా | శృణు శౌనక సుప్రీత్యా క్రమశస్తాన్యశస్వినః || 8

మరీచిరత్రిర్భగవానంగిరాః పులహః క్రతుః | పులస్త్యశ్చ వసిష్ఠశ్చ సప్తై#ుతే బ్రహ్మణస్సుతాః || 9

ఉత్తరస్యాం దిశి తథా మునే సప్తర్షయస్తథా | యామా నామ తథా దేవా ఆసన్ స్వాయంభువేంతరే || 10

అగ్నీధ్రశ్చాగ్నిబాహుశ్చ మేధా మేధాతిథిర్వసుః | జ్యోతిష్మాన్ ధృతిమాన్ హవ్యః సవనశ్శుభ్ర ఏవ చ || 11

స్వాయంభువస్య పుత్రాస్తే మనోర్దశ మహాత్మనః | కీర్తితా మునిశార్దూల తత్రేంద్రో యజ్ఞ ఉచ్యతే || 12

సూతుడు ఇట్లు పలికెను -

ఓ మహర్షీ! స్వాయంభువమనువు, స్వారోచిషుడు, ఉత్తముడు, తామసుడు, రైవతుడు, చాక్షుషుడు అనే ఆర్గురు మనువులు గలరని నీకు ఇదివరలో చెప్పబడినది. ఓ మహర్షీ! ప్రస్తుతము వైవస్వతమనువుయొక్క కాలము జరుగుచున్నది (2, 3). సావర్ణిమనువు, రౌచ్యుడు, బ్రహ్మసావర్ణి అను వారితో బాటు ధర్మ-రుద్ర-దేవ- ఇంద్రసావర్ణులు అనే నలుగురు మనువులను కలుపుకొని గడచిన, నడుచుచున్న, మరియు రాబోయే మనువులను అందరిని గురిచి చెప్పినట్లైనది. నేను ఈ వివరములను విన్న దానికి అనుగుణముగా చెప్పితిని (4-6). ఓ
మునీ ! భూతవర్తమానభవిష్యత్కాలములకు సంబంధించి వీరు పదునలుగురు మనువులు అని చెప్పబడినది. ఈ మన్వంతరములు అన్నీ కలిసి కల్పము అగును. కల్పమనగా వేయి మహా యుగములు (7). ఓ శౌనకా ! నేను ఆయా మన్వంతరములకు చెందిన ఋషులను, వారి పుత్రులను, దేవగణములను గురించి క్రమముగా చెప్పెదను. కీర్తిమంతులగు వారిని గురించి నీవు అతిశయించిన

ప్రీతితో వినుము (8). మరీచి, అత్రి, పూజ్యుడగు అంగిరసుడు, పులహుడు, క్రతువు, పులస్త్యుడు, వసిష్ఠుడు అనే ఏడుగురు బ్రహ్మయొక్క పుత్రులు (9). ఓ మునీ ! ఈ ఏడ్గురు ఋషులు ఉత్తరదిక్కునందు గలరు. స్వాయంభువమన్వంతరములో యాములు అనే దేవతలు గలరు (10). ఓ మహర్షీ! మహాత్ముడగు స్వాయంభువమనువుకు అగ్నీధ్రుడు, అగ్నిబాహుడు, మేధ, మేధాతిథి, వసువు, జ్యోతిష్మంతుడు, ధృతిమంతుడు, హవ్యుడు, సవనుడు, శుభ్రుడు అనే పదిమంది పుత్రులు గలరని చెప్పబడినది. ఆ మన్వంతరములోని ఇంద్రునకు యజ్ఞుడు అని పేరు (11, 12).

ప్రథమం కథితం తాత దివ్యం మన్వంతరం తథా | ద్వితీయం తే ప్రవక్ష్యామి తన్నిబోధ యథాతథమ్ || 13

ఊర్జస్తంభః పరస్తంభ ఋషభో వసుమాంస్తథా | జ్యోతిష్మాన్ ద్యుతిమాంశ్చైవ రోచిష్మాన్ సప్తమస్తథా || 14

ఏతే మహర్షయో జ్ఞేయాస్తత్రేంద్రో రోచనస్తథా | దేవాశ్చ తుషితా నామ స్మృతాస్స్వారోచిషే. ంతరే|| 15

హరిఘ్నస్సుకృతిర్జ్యోతిరయోమూర్తిరయస్మయః | ప్రథితశ్చ మనస్యుశ్చ న భసూస్సర్యస్తథైవ చ || 16

స్వారోచిషస్య పుత్రాస్తే మనోర్దశ మహాత్మనః | కీర్తితా మునిశార్దూల మహావీర్యపరాక్రమాః || 17

ద్వితీయమేతత్కథితం మునే మన్వంతరం మయా | తృతీయం తవ వక్ష్యామి తన్నిబోధ యథాతథమ్ || 18

వసిష్ఠపుత్రాస్సప్తాసన్ వాసిష్ఠా ఇతి విశ్రుతాః | హిరణ్యగర్భస్య సుతా ఊర్జా నామ మహౌజసః || 19

ఋషయో%త్ర సమాఖ్యాతాః కీర్త్యమానాన్నిబోధమే | ఔత్తమేయా ఋషిశ్రేష్ఠ దశ పుత్రా మనోః స్మృతాః || 20

ఇష ఊర్జిత ఊర్జశ్చ మధుర్మాధవ ఏవ చ | శుచిశ్శుక్రవహశ్చైవ నభసో నభ ఏవ చ || 21

ఋషభస్తత్ర దేవాశ్చ సత్యవేదశ్రుతాదయః | తత్రేంద్రస్సత్యజిన్నామ త్రైలోక్యాధిపతిర్మునే || 22

ఓ వత్సా! నీకు నేను దివ్యమైన మొదటి మన్వంతరమును గురించి చెప్పితిని. ఇప్పుడు రెండవ మన్వంతరమును గురించి చెప్పెదను. దానిని యథాతథముగా తెలుసుకొనుము (13). దానియందు ఊర్జస్తంభుడు, పరస్తంభుడు, ఋషభుడు, వసుమంతుడు, జ్యోతిష్మంతుడు, ద్యుతిమంతుడు, రోచిష్మంతుడు అను ఏడ్గురు ఋషులు అనియు, ఇంద్రుడు రోచనుడనియు తెలియవలెను. ఈ స్వారోచిషమన్వంతరములో దేవతలకు తుషితులని పేరు (14, 15). మహాత్ముడగు స్వారోచిషమనువునకు హరిఘ్నుడు, సుకృతి, జ్యోతి, అయోమూర్తి, అయస్మయుడు, ప్రథితుడు, మనస్యుడు, నభస్సు, సూర్యుడు అనే పది మంది (?) పుత్రులు గలరు. ఓ మహర్షీ ! వీరు గొప్ప వీర్యము, పరాక్రమము గలవారని కీర్తింపబడిరి (16, 17). ఓ మునీ ! నేను నీకు ఈ విధముగా రెండవ మన్వంతరమును గురించి చెప్పితిని. ఇప్పుడు మూడవ దానిని చెప్పెదను. దానిని యథాతథముగా తెలుసుకొనుము (18). వసిష్ఠునకు ఏడ్గురు పుత్రులు గలరు. వారికి వాసిష్ఠులు అని పేరు. హిరణ్యగర్భునకు గొప్ప తేజస్సు గల ఊర్జులు అనే పుత్రులు గలరు (19). వీరు ఆ మన్వంతరములోని ఋషులని చెప్పబడినది. ఓ మహర్షీ ఉత్తమమనువునకు పదిమంది పుత్రులు గలరు. నేను వారిని గురించి చెప్పెదను. తెలుసుకొనుము (20). ఇషుడు, ఊర్జితుడు, ఊర్జుడు, మధువు, మాధవుడు, శుచి , శుక్రవహుడు, నభసుడు, నభస్సు, ఋషభుడు అనునవి వారి పేర్లు. ఆ మన్వంతరములో సత్యవేదశ్రుతులు మొదలగు వారు దేవతలు. ఓ మునీ ! దానియందు ముల్లోకములకు అధిపతి యగు ఇంద్రుని పేరు సత్యజిత్తు (21, 22).

తృతీయమేతత్పరమం మన్వంతరముదాహృతమ్ | మన్వంతరం చతుర్థం తే కథయామి మునే శృణు || 23

గార్గ్యః పృథుస్తథా వాగ్మీ జయో ధాతా కపీనకః | కపీవాన్ సప్త ఋషయస్సత్యా దేవగణాస్తథా || 24

తత్రేంద్రస్త్రి శిఖో జ్ఞేయో మనుపుత్రాన్మునే శృణు | ద్యుతిపోతస్సౌతపస్యస్తమశ్శూలశ్చ తాపనః || 25

తపోరతిరకల్మాషో ధన్వీ ఖడ్గీ మహానృషిః | తామసస్య స్మృతా ఏతే దశ పుత్రా మహావ్రతాః || 26

తామసస్యాంతరం చైవ మనోర్మే కథితం తవ | చతుర్థం పంచమం తాత శృణు మన్వంతరం పరమ్ || 27

దేవబాహుర్జయశ్చైవ మునిర్వేదశిరాస్తథా | హిరణ్యరోమా పర్జన్య ఊర్ధ్వ బాహుశ్చ సోమపాః || 28

సత్యనేత్రరతాశ్చాన్యే ఏతే సప్తర్షయో%పరే | దేవాశ్చ భూతరజసస్తపః ప్రకృతయస్తథా || 29

తత్రేంద్రో విభునామా చ త్రైలోక్యాధిపతిస్తథా | రైవతాఖ్యో మనుస్తత్ర జ్ఞేయస్తామససోదరః || 30

అర్జునః పంక్తివింధ్యో వా దయాయాస్తనయా మునే | మహతా తపసా యుక్తా మేరుపృష్ఠే వసంతి హి || 31

రుజేః ప్రజాపతేః పుత్రో రౌచ్యో నామ మనుః స్మృతః | భూత్యాం చోత్పాదితో దేవ్యాం భౌత్యో నామాభవత్సుతః || 32

అనాగతాశ్చ సపై#్తతే కల్పే%స్మిన్మనవస్స్మృతాః | అనాగతాశ్చ సపై#్తవ స్మృతా దివి మహర్షయః || 33

శ్రేష్ఠమగు ఈ మూడవ మన్వంతరమును గురించి చెప్పితిని. ఓమునీ! నీకు నాల్గవ మన్వంతరమును గురించి చెప్పెదను. వినుము (23). దానిలో గార్గ్యుడు, పృథువు, వాగ్మి, జయుడు, ధాత, కపీనకుడు, కపీవంతుడు అను వారు సప్తర్షులు. దాని యందు దేవగణములు సత్యులనబడుదురు (24). ఓ మునీ! దానియందు ఇంద్రునకు త్రిశిఖుడని పేరు. ఇప్పుడు తామస మనువుయొక్క పుత్రులను గురించి చెప్పెదను. వినుము. తామసమనువునకు ద్యూతిపోతుడు, సౌతపస్యుడు, తమసుడు, శూలుడు, తాపనుడు, తపోరతి,అకల్మాషుడు, ధన్వి, ఖడ్గి, మహాత్ముడగు ఋషి అనే గొప్ప నిష్ఠ గల పదిమంది పుత్రులు గలరు (25, 26). ఈ విధముగా నాల్గవ తామసమన్వంతరమును గురించి చెప్పితిని. ఓ వత్సా!అయిదవ గొప్ప మన్వంతరమును గురించి వినుము (27). దేవబాహువు, జయుడు, వేదశిరస్సు అనే ముని, హిరణ్యరోముడు, పర్జన్యుడు, ఊర్ధ్వబాహువు, సోమపుడు అను వారు సప్తర్షులు. వారు సత్యమే నేత్రముగా గలవారై సత్యమునందు ప్రీతి కలిగి యుండిరి. వీరే గాక, ఇతరులగు మహర్షులు కూడ గలరు. భూత రజసులు అనబడే దేవతలు తపస్సును చేసే స్వభావమును కలిగియుందురు (28, 29). ఆ మన్వంతరములో ముల్లోకములకు అధిపతియగు ఇంద్రునకు విభుడు అని పేరు. దీనికి రైవతమన్వంతరము అని పేరు. రైవతుడు తామసుని సోదరుడని తెలియదగును (30). ఓ మునీ! ఆయన కుమారులు అగు అర్జునుడు, పంక్తివింధ్యుడు మొదలగు వారు మేరుశిఖరముపై నివసించి గొప్ప తపస్సును చేయుదురు. వీరు దయాదేవి యొక్క పుత్రులు (31). రౌచ్యమనువు రుచిప్రజాపతి యొక్క పుత్రుడని మహర్షులు చెప్పెదరు. ఆయనకు భూతిదేవియందు భౌత్యుడు అనే పుత్రుడు కలిగెను (32). ఈ కల్పమునందు ఇంకనూ గడవని ఏడు మన్వంతరములు గలవు. వాటియందు కూడా ఏడ్గురు మహర్షులు స్వర్గలోకమునందు ఉండెదరని చెప్పబడినది (33).

రామో వ్యాసస్తథాత్రేయో దీప్తిమాన్ సుబహుశ్రుతః | భరద్వాజస్తథా ద్రౌణిరశ్వత్థామా మహాద్యుతిః || 34

గౌతమస్యాత్మజశ్చైవ శరద్వాన్ గౌతమః కృపః | కౌశికో గాలవశ్చైవ రురుః కశ్యప ఏవ చ || 35

ఏతే సప్త మహాత్మానో భవిష్యా మునిసత్తమాః | దేవాశ్చానాగతాస్తత్ర త్రయః ప్రోక్తాస్స్వయంభువా || 26

మారీచేశ్చైవ పుత్రాస్తే కశ్యపస్య మహాత్మనః | తేషాం విరోచనసుతో బలిరింద్రో భవిష్యతి || 37

విషాంగశ్చావనీవాంశ్చ సుమంతో ధృతిమాన్ వసుః | సూరిస్సురాఖ్యో విష్ణుశ్చ రాజా సుమతిరేవ చ || 38

సావర్ణేశ్చ మనోః పుత్రా భవిష్యా దశ శౌనక | ఇహాష్టమం హి కథితం నవమం చాంతరం శృణు || 39

ప్రథమం దక్షసావర్ణిం ప్రవక్ష్యామి మనుం శృణు | మేధాతిథిశ్చ పౌలస్త్యో వసుః కశ్యప ఏవ చ || 40

జ్యోతిష్మాన్ భార్గవశ్చైవ ధృతిమానంగిరాస్తథా | సవనశ్చైవ వాసిష్ఠ ఆత్రేయో హవ్య ఏవ చ || 41

పులహాస్సప్త ఇత్యేతే ఋషయో రౌహితేంతరే | దేవతానాం గణాస్తత్ర త్రయ ఏవ మహామునే || 42

దక్ష పుత్రస్య పుత్రాస్తే రోహితస్య ప్రజాపతేః | ధృష్టకేతుర్దీప్తకేతుః పంచహస్తో నిరాకృతిః || 43

పృథు శ్రవా భూరిద్యుమ్నో ఋచీకో బృహతో గయః | ప్రథమస్య తు సావర్ణేర్నవ పుత్రా మహౌజసః || 44

పరశు రాముడు, వ్యాసుడు, ఆత్రేయుడు, దీప్తిమంతుడు, సుబహుశ్రుతుడు, భరద్వాజుడు, ద్రోణుని కుమారుడగు అశ్వత్థామ అను ఏడ్గురు ఈ మన్వంతరములోని ఋషులు (34). గౌతముని పుత్రుడగు శరద్వంతుడు, గౌతముడు, కృపుడు, కౌశికుడు, గాలవుడు,

రురుడు, కశ్యపుడు అనే ఈ ఏడుగురు మహాత్ములు భవిష్యత్తులోని మహర్షులు. రాబోయే మన్వంతరములోని దేవతలు మూడు రకములుగా నుందరుని స్వయంభువుడగు బ్రహ్మ చెప్పెను (35, 36). వారే మరీచిపుత్రుడు, మహాత్ముడు, అగు కశ్యపుని పుత్రులు. విరోచనుని పుత్రుడగు బలి వారికి ఇంద్రుడు కాగలడు (37). ఓ శౌనకా ! భవిష్యత్తులో సావర్ణి మనవునకు విషాంగుడు, అవనీవంతుడు, సుమంతుడు, ధృతిమంతుడు, వసువు, సూరి, సురుడు, విష్ణువు, రాజు, సుమతి అనే పది మంది పుత్రులు కలిగెదరు. ఇంతవరకు నీకు ఎనిమిదవ మన్వంతరమును గురించి చెప్పితిని. ఇప్పుడు తొమ్మిదవ మన్వంతరమును గురించి వినుము (38,39). మున్ముందుగా దక్షసావర్ణి మనువును గురించి చెప్పెదను వినుము. పులస్త్యవంశమునందు పుట్టిన మేధాతిథి, వసువు, కశ్యపుడు, తేజశ్శాలి భృగువంశమునందు జన్మించినవాడు ధైర్యశాలి అగు అంగీరసుడు, వసిష్ఠపుత్రుడగు సవనుడు, అత్రి కుమారుడగు హవ్యుడు, పులహుడు అనే ఏడుగురు ఋషులు రౌహితమన్వంతరములో నుండెదరు. ఓ మహర్షీ !ఆ మన్వంతరములో దేవతా గణములు మూడు కూడ ఉండును (40-42). దక్షుని కుమారుడు, దక్షసావర్ణి అని ఖ్యాతిని గాంచినవాడు, గొప్ప తేజశ్శాలి అగు రోహితప్రజాపతికి ధృష్టకేతువు, దీప్తకేతువు, పంచహస్తుడు, నిరాకృతి, పృథుశ్రవసుడు, భూరిద్యుమ్నుడు, ఋచీకుడు, బృహతుడు, గయుడు అనే తొమ్మిదిమంది పుత్రులు గలరు (43, 44).

దశ##మే త్వథ పర్యాయే ద్వితీయస్యాంతరే మనోః | హవిష్మాన్ పులహశ్చైవ ప్రకృతిశ్చైవ భార్గవః || 45

ఆయో ముక్తిస్తథాత్రేయో వసిష్ఠశ్చావ్యయస్స్మృతః | పౌలస్త్యః ప్రయతిశ్చైవ భామారశ్చైవ కశ్యపః || 46

అంగిరానేనసస్సత్యస్సపై#ృతే పరమర్షయః | దేవతానాం గణాశ్చాపి ద్విషిమంతశ్చ తేస్మృతాః || 47

తేషామింద్రస్స్మృతశ్శంభుస్త్వయమేవ మహేశ్వరః |
అక్షత్వానుత్తమౌజాశ్చ భూరిషేణశ్చ వీర్యవాన్ || 48

శతానీకో నిరామిత్రో వృషసేనో జయద్రథః |
భూరిద్యుమ్నస్సువర్చార్చిర్దశ త్వేతే మనోస్సుతాః || 49

ఏకాదశే తు పర్యాయే తృతీయస్యాంతరే మనోః | తస్యాపి సప్త
ఋషయః కీర్త్యమానాన్నిబోధమే || 50

హవిష్మాన్ కశ్యపశ్చాపి వపుష్మాంశ్చైవ వారుణః | ఆత్రేయో%థ
వసిష్ఠశ్చ హ్యనయస్త్వంగిరాస్తథా || 51

చారుధృష్యశ్చ పౌలస్త్యో నిస్స్వరో%గ్నిస్తు తైజసః | సప్తై#ుతే
ఋషయః ప్రోక్తాస్త్రయో దేవగణాస్స్మృతాః || 52

బ్రహ్మణస్తు సుతాస్తే హి త ఇమే వైధృతాస్స్మృతాః | సర్వగశ్చ
సుశర్మా చ దేవానీకస్తు క్షేమకః || 53

దృఢేషుః ఖండకో దర్శః కుహూర్బాహుర్మనోస్స్మృతాః | సావర్ణస్య తు
పౌత్రా వై తృతీయస్య నవ స్మృతాః || 54

చతుర్థస్య తు సావర్ణేః ఋషీన్ సప్త నిబో ధ మే |
ద్యుతిర్వసిష్ఠపుత్రశ్చ ఆత్రేయస్సుతపాస్తథా || 55

అంగిరాస్తపసో మూర్తిస్తపస్వీ కశ్యపస్తథా | తపోధనశ్చ పౌలస్త్యః
పులహశ్చ తపోరతిః || 56

భార్గవస్సప్తమస్తేషాం విజ్ఞేయస్తపసో నిధిః | పంచ దేవగణాః ప్రోక్తా
మానసా బ్రహ్మణస్సుతాః || 57

పదవది యగు రెండవ సావర్ణియొక్క మన్వంతరములో హవిష్మంతుడు, పులహుడు, ప్రకృతి, భార్గవుడు (45), ఆయుడు, ముక్తి, ఆత్రేయుడు, వసిష్ఠుడు, అవ్యయుడు అను ఋషులతో బాటు పౌలస్త్యుడు, ప్రయతి, భామారుడు, కశ్యపుడు (46), అంగిరసుడు,

అనేనసుడు, సత్యుడు అను ఏడుగురు ఋషులు ఉండెదరు. ఆ మన్వంతరములోని దేవతా గణములకు ద్విషిమంతులు అని పేరు (47). మహేశ్వరుడగు ఈ శంభుడే వారికి ఇంద్రుడని చెప్పబడినది. అక్షత్వంతుడు, ఉత్తమౌజసుడు, భూరిషేణుడు, వీర్యవంతుడు, శతానీకుడు, నిరామిత్రుడు, వృషసేనుడు, జయద్రథుడు, భూరిద్యుమ్నుడు, సువర్చార్చి అను పదిమంది ఆ మనువు యొక్క పుత్రులు (48, 49). మూడవ సావర్ణియొక్క పదకొండవ మన్వంతరములో కూడ సప్తర్షులు గలరు. వారి పేర్లను నేను చెప్పెదను. విని తెలుసుకొనుము (50). హవిష్మంతుడు, కశ్యపుడు, వపుష్మంతుడు, వారుణుడు, ఆత్రేయుడు, విసిష్ఠుడు అనే ఋషులతో బాటు అనయుడు, అంగిరసుడు, చారుధృష్యుడు, పౌలస్త్యుడు, నిస్స్వరుడు, అగ్ని, తైజసుడు అనే సప్తరుషులు కూడ గలరు. వీరు గాక, మూడు దేవగణములు గలరు (51, 52). బ్రహ్మపుత్రులగు ఆ దేవతలకు వైధృతులు అని పేరు. మూడవ సావర్ణికి సర్వగుడు, సుశర్మ, దేవానీకుడు, క్షేమకుడు, దృఢేషువు, ఖండకుడు, దర్శుడు, కుహుడు, బాహుడు, అనే తొమ్మిది మంది పుత్రులు గలరు (53, 54). ఈ తొమ్మిదిమంది సావర్ణునకు పౌత్రులు. నాల్గవ సావర్ణికి సంబంధించిన ఏడ్గురు ఋషులను గురించి తెలుసుకొనుము. వసిష్ఠపుత్రుడగు ద్యుతి, గొప్ప తపశ్శాలియగు ఆత్రేయుడు, తపోమూర్తి యగు అంగిరసుడు, తపశ్శాలియగు కశ్యపుడు, తపోధనుడగు పౌలస్త్యుడు, తపస్సునందు గొప్ప ప్రీతి గల పులహుడు మరియు ఏడవ వాడు మరియు తపోనిధి యగు భార్గవుడు అను వారు సప్తర్షులు. బ్రహ్మయొక్క మానసపుత్రులగు అయిదు దేవగణములు కూడ గలవు (55-57).

ఋతధామా తదింద్రో హి త్రిలోకీ రాజ్యకృత్సుఖీ | ద్వాదశే చైవ పర్యాయే భావ్యే రౌచ్యాంతరే మునే || 58

అంగిరాశ్చైవ ధృతిమాన్ పౌలస్త్యో హవ్యవాంస్తు యః | పౌలహస్తత్త్వదర్శీ చ భార్గవశ్చ నిరుత్సవః || 59

నిష్ప్రపంచస్తథాత్రేయో నిర్దేహః కశ్యపస్తథా | సుతపాశ్చైవ వాసిష్ఠస్సప్తై#ైతే మహర్షయః || 60

త్రయ ఏవ గణాః ప్రోక్తా దేవతానాం స్వయంభువా |
దివస్పతిస్తమింద్రో వై విచిత్రశ్చిత్ర ఏవ చ || 61

నయో ధర్మో ధృతో%ంధ్రశ్చ సునేత్రః క్షత్రవృద్ధకః |
నిర్భయస్సుతపా ద్రోణో మనో రౌచ్యస్య తే సుతాః || 62

చతుర్దశే తు పర్యాయే సత్యసై#్యవాంతరే మనోః | ఆగ్నీధ్రః కాశ్యపశ్చైవ పౌలస్త్యో మాగధశ్చ యః || 63

భార్గవో%ప్యతివాహ్యశ్చ శుచిరాంగిరసస్తథా | యుక్తశ్చైవ తథాత్రేయః పౌత్రో వాశిష్ఠ ఏవ చ || 64

అజితః పులహశ్చైవ హ్యంత్యాస్సప్తర్షయశ్చ తే | పవిత్రాశ్చాక్షుషా దేవాశ్శుచిరింద్రో భవిష్యతి || 65

ఏతేషాం కల్య ఉత్థాయ కీర్తనాత్సుఖమేధతే | అతీతానాగతానాం వై మహర్షీణాం నరైస్సదా || 66

దేవతానాం గణాః ప్రోక్తాశ్శృణు పంచ మహామునే |
తురంగభీరుర్బధ్నశ్చ తనుగ్రో%నూగ్ర ఏవ చ || 67

అతిమానీ ప్రవీణశ్చ విష్ణుస్సంక్రందనస్తథా | తేజస్వీ సబలశ్చైవ సత్యస్త్వేతే మనోస్సుతాః || 68

ఆ మన్వంతరములో ఋతధామ అనబడే ఇంద్రుడు సుఖముగా ముల్లోకములను ఏలును. ఓమునీ ! భవిష్యత్తులో రాబోయే పన్నెండు రౌచ్యమన్వంతరములో ధైర్యశాలి యగు అంగిరసుడు, పులస్త్యవంశీయుడగు హవ్యవంతుడు, తత్త్వమునెరింగిన పౌలహుడు, సంసారమునందు ఉత్సాహము లేని భార్గవుడు, మిథ్యాప్రపంచమును త్రోసిపుచ్చిన ఆత్రేయుడు, దేహాభిమానము లేని కశ్యపుడు, గొప్ప తపశ్శాలియగు వాసిష్ఠుడు అను వారలు సప్తమహర్షులుగా నుందురు

(58-60). అప్పుడు స్వాయంభువుడగు బ్రహ్మ మూడు దేవతాగణములను సృష్టించును. స్వర్గలోకాధిపతికి ఆ మన్వంతరములో ఇంద్రుడనియే పేరు. విచిత్రుడు, చిత్రుడు (61). నయుడు, ధర్ముడు, ధృతుడు, అంధ్రుడు, సునేత్రుడు, క్షత్రవృద్ధకుడు, నిర్భయుడు, సుతపసుడు మరియు ద్రౌణుడు అనువారలు రౌచ్యమనువు యొక్క పుత్రులు అగుదురు (62). సత్యమనువుయొక్క పదునాల్గవ మన్వంతరములో కశ్యపపుత్రుడగు ఆగ్నీధ్రుడు, పులస్త్యతనయుడగు మాగధుడు, భృగువంశీయుడగు అతివాహ్యుడు, అంగిరసపుత్రుడగు శుచి, జ్ఞాని మరియు ఆత్రేయుని పౌత్రుడు అగు వాసిష్ఠుడు, అజితుడు మరియు ఏడవవాడగు పులహుడు అనే ఆఖరి సప్తర్షులు ఉండెదరు. పవిత్రులగు చాక్షుషులు దేవతలు కాగా, శుచి ఇంద్రుడు అగును (63-65). ఉదయమే నిద్ర లేచి గడచిన మరియు రాబోయే ఈ మహర్షులను కీర్తించు మానవులకు సుఖము వర్ధిల్లును (66). ఓ మహర్షీ ! వినుము. దీనిలో అయిదు దేవతాగణములు ఉండునని చెప్పబడినది. తురంగభీరువు, బుధ్నుడు, తనుగ్రుడు, అనూగ్రుడు, అతిమాని, ప్రవీణుడు, విష్ణువు, సంక్రందనుడు, తేజస్వి, సబలుడు మరియు సత్యుడు అనువారలు మనువుయొక్క పుత్రులు (67,68).

భౌమస్యై#్యవాధికారే వై పూర్వకల్పస్తు పూర్యతే |
ఇత్యేతే%నాగతా%తీతా మనవః కీర్తితా మయా || 69

ఉక్తాస్సనత్కుమారేణ వ్యాసాయామితతేజసే | పూర్ణే యుగసహస్రాంతే పరిపాల్య స్వధర్మతః || 70

ప్రజాభిస్తపసా యుక్తా బ్రహ్మలోకం వ్రజంతి తే | యుగాని సప్తతిస్త్వేకం సాగ్రాణ్యంతరముచ్యతే || 71

చతుర్దశైతే మనవః కీర్తితాః కీర్తివర్ధనాః | మన్వంతరేషు సర్వేషు సంహారాంతే పునర్భవః || 72

న శక్యమంతరం తేషాం వక్తుం వర్షశ##త్రైరపి | పూర్ణే శతసహస్రే తు కల్పే నిశ్శేష ఉచ్యతే || 73

తత్ర సర్వాణి భూతాని దగ్ధాన్యాదిత్యరశ్మిభిః | బ్రహ్మాణమగ్రతః కృత్వా సదాదిత్య గణైర్మునే || 74

ప్రవిశంతి సురశ్రేష్ఠం హరిం నారాయణం పరమ్ | స్రష్టారం సర్వభూతానాం కల్పాంతేషు పునః పునః || 75

భూయోపి భగవాన్ రుద్రస్సంహర్తా కాల ఏవ హి | కల్పాంతే తత్ప్రవక్ష్యామి మనోర్వైవస్వతస్య వై || 76

ఇతి తే కథితం సర్వం మన్వంతరసముద్భవమ్ | విసర్గం పుణ్యమాఖ్యానం ధన్యం కులవివర్ధనమ్ || 77

ఇతి శ్రీ శివమహాపురాణ ఉమాసంహితాయాం సర్వమన్వంతరానుకీర్తనం నామ చతుస్త్రింశో%ధ్యాయః (34).

దీనికి ముందు ఉన్న కల్పము భౌముని అధికారములో పూర్ణమైనది (?). ఈ విధముగా నేను గడచిన మరియు రాబోయే మనువులను గురించి చెప్పితిని (69). ఈ వివరములను సనత్కుమారుడు మహాతేజశ్శాలియగు వ్యాసునకు చెప్పెను. తపశ్శాలురగు ఆ మనవులు ప్రజలను స్వధర్మానురూపముగా పరిపాలించి వేయి యుగములు పూర్తి అయిన తరువాత సంతానముతో సహా బ్రహ్మలోకమును పొందెదరు. డెబ్బది ఒక్క యుగములు మరియు యుగములోని ఒక అంశము కలిసి ఒక మన్వంతరమగును (70. 71). కీర్తిని వర్ధిల్లజేయు ఈ పదునాల్గు మనువులను గురించి వర్ణించితిని. మన్వంతరములన్నింటి యందు జగత్తు ప్రళయములో ఈశ్వరునియందు విలీనమై మరల సృష్టి జరుగుచుండును (72). ఆ మన్వంతరముల మధ్యలోని కాలమును వర్ణించుటకు వందల సంవత్సరములు కాలమైననూ చాలదు. వేయి మహాయుగముల కాలము పూర్తి కాగానే కల్పము నిశ్శేషమగును (73). ఓ మునీ ! ఆ

కాలమునందు సూర్యరశ్మలచే దహింపబడిన సర్వప్రాణులు బ్రహ్మను ముందిడుకొని ప్రకాశించే ఆదిత్యగణములతో కలిసి, దేవతలతో శ్రేష్ఠుడు పరాత్పరుడు పాపహారి సర్వప్రాణులను సృష్టించువాడు అగు నారాయణుని ప్రవేశించెదరు. ఈ విధముగా ప్రతి కల్పాంతమునందు జరుగుచుండును (74, 75). మరల కాలరూపుడగు రుద్ర భగవానుడు కల్పము పూర్తి అయిన తరువాత జగత్తును ఉపసంహరించును. వైవస్వతమనువుయొక్క వృత్తాంతమును మరల చెప్పగలను(76). నేనింతవరకు మన్వంతరములు పుట్టిన విధానమును మరియు వివిధరకముల సృష్టిని వర్ణించితిని. ధన్యము మరియు పుణ్యము అగు ఈ వృత్తాంతము కులమును వర్ధిల్లజేయును (77).

శ్రీ శివమహాపురాణములోని ఉమాసంహితయందు మన్వంతరవర్ణనమనే ముప్పది నాల్గవ అధ్యాయము ముగిసినది (34).